చ.—[ప్రవే. హైదరల్లీ నుద్దేశించి] సర్కార్ సాహెబ్, ఖిల్లాకి కుడి యెడమ అన్నివైపుల ఆగాడి పచాడి లడాయి అయితుంది. వక్ సర్దార్ వకసర్దారుక్కు ఖుమ్మక్కు చెయ్యడానిక్కి లేదు. తమరు వస్తే కాపుపేట అయినా పడిపోతుంది, అని అనమరల్లి సాహెబు చెప్తారు.

హైదరు.—నేను యేలడాయికి అయినా వద్దానుగాని కబ్జుఘుకు రల్లా నాగేటి లడాయికి మాత్రం రాను. [చ. నిష్క్రమించును.

బుస్సీ.—ఏమి రాజా? మమ్ముల నందఱను ఇక్కడ గుండానపై చుటకు తెచ్చినారా?

రాజు.—నేను ముందే చెప్పలేదా? నన్ను బొబ్బిలివారి బట్రాజంటిరే!

చ.—[ప్రవే.] సర్కార్, మర్గయా అనమరల్లీఖాన్; మర్గయా సర్కార్; అనమరల్లీఖాన్; మర్గయా; [అని నిష్క్రమించును.

ద్వి—[ప్రవే.] సర్కార్, షేపేఖాన్ లెగిశినాడు. మనివాళ్లు ఇప్పుడు కాపుపేటమీద వున్నారు. కాపుపేట వాళ్లకీ కిందా వుంది. [అని నిష్క్రమించును.

తృ.—[ప్రవేశించి] మన సార్కారా వుంటే కూమాభాయి, అడు దారిలో బాణం తగిలి మర్గయా. షేం ఇంకా మర్గయా లేదు. [అని పోనుంకించును.

దౌవారికుఁడు.—అరే సార్కారా జవాన్, నీవు ఇంకా మర్గయా లేదూ అన్నావే. నీవు కూడా మర్గయా అయినావు వోయి; చేకోప్తే యెందుకీ తెచ్చినావువోయి అకూకూ గాతిది వపూసారమ్?

తృ—అరే మేము ఇంకా మర్గయా లేదూ అంటే!

దౌవా.—ఉందీ అంటే!

తృ.—అరే లేదురా అంటే!

దౌవా.—అరే ఉందీరా అంటే.

తృ.—నీకి ఇప్పుడు మర్గయా చేస్తాన్. [అని కత్తి దూయును.

దొవా.—ఎగ్తాళికి చెప్పినాఁ భాయి.

తృ.—నీకే యెగ్తాళి వుంది, మాఁకే సావు వుంది.

దొవా.—అదే నేను చెప్పినమాట. పోభాయి పో. [తృ. నిష్క్ర.

చ.—[ప్రవేశించి] సర్కార్ సలాం, పెద్దబురుజు వుందీ లేదు, దాన్కి బేతాళం సామ్ చెప్తారు. ఆబేతాళబురుజుమీద్కి మనాళ్లు నిచ్చెనలు వేసియెక్తారు; ఎక్కినంత మంది ఖందకం వుందీ లేదు కిందా; అందులో పడ్తారు. ధూరాన్కి చీమల్బారు కన్పడ్తుంది. బారు ఎక్కుతుంది, నిచ్చెన జాడించినారు లాగ బారు పడిపోతుంది. ఎల్లుబంటిబారు ఎక్తుంది, కోతుల్బారు పడ్తుంది. [అని నిష్క్రమించును.

[తృ. మిక్కిలి రోఁజుచు మహాసంభ్రమముతో ప్రవేశించును.

బూసీ.—ఏమిరా యీయడావిడి?

తృ.—సాబ్! ఏమిచెప్పడం; పెద్దఫిరంగిగుండు నాకీ భాఅని తరుమ్కొనివచ్చింది, బురుజుమీదానుంచీ. నేను దాన్కికంటే ముందు రావాలకోసం బలేసర్గుచేసుకచ్చినాఁ, దాన్కిచేత గాభరా అయింది.

బుసీ.—[హైదరుతోను రాజుతోను జనాంతికము] వీఁడు తెచ్చు వృత్తాంతమంతయు ఇట్టిదిగానే యుండునా? [ప్రకాశము] ఏమిరా ఒడలు తెలిసి మాటలాడుచున్నావా?

తృ.—పోయి సూడండి సాబ్, ఇంకా అది యెన్క దిగబడే వస్తా వుంటుంది. ఇప్పటిక్కి మీకే తగుల్తుంది.

బుసీ.—పోరా మూర్ఖా.

తృ.—సాహెబ్, ఎన్ని ఫిరంగులు కొట్టినా గోడ దెబ్బకీ దెబ్బకీ వఖతులం పెళ్ల రాల్తుంది. గోడ పగల్దు, బొక్కపడదు. గుండు గుండు అక్కడ అక్డ గ్రుచ్చుకొని గాండామృగం తోలు మచ్చాల్ లేదూ, అదీలాగా వుంటుంది. దగ్ర వెల్లడానికి పాచినీళ్లు, ఖంపు, అడుస్సు, బురద, వూబి, ఖందకం. దాన్కిమీద వంతెన కట్టి, ఖిల్లాకి బొక్కచెయ్యడానికి

పోతే, ఉప్పుర్నుంచి, చాటుచాటుమే వుండి ఖాఫన్లుబజాబజా రాయిబండలో దొర్లుతారు. మనివాళ్లు తుపాకులు లక్షపేల్చినా, చాటుమేవుంటే ఖాపర్కు తగల్దు. ఒఖ్యాఖ్ ఖాఫుర్ వాగ్పడ్తాడు; వాడ్కి దూరం గుండు తగుల్తాదూ లేదు; వాడు పడ్తాడూ లేదు. అఖాపుర్ గాడ్డి బాణం కిందికి భుర్రుభుర్రు భుర్రుభుర్రువస్తుంది. ఒఖాన్కి ఒఖాన్కి ఒఖ్ఖు ఒఖ్ఖు మన దాడీవాలా మర్గయా. చీకటి చేసి, వంతెన వేశిబొక్కా కర్తాహే. బలే డౌళ్ సరివుంది. బొక్కా అవతల్కి పోదు ‘కోట పట్టలేము, ఖుమ్మక్కు కావాలా.’ చెప్తారు ముసేటకితాఞ సాహేబు.

బుస్సీ.—లగ్గలెక్కువారికి ఖుమ్మక్కు చేయుమను.

తృ.—బస్. [అని నిష్క్రమించును.

బుస్సీ.—హైదర్సాబ్. రాతికోటకంటె, ఇటికకోటకంటె మట్టికోట పడగొట్టుట కష్టముగా నున్నది!

హైదరు.—ఇప్పుడు తెలుస్తావుంది.

చ.—[ప్రవేశించి] సర్కార్ సలామ్, బేతాళ్ బురుజామే ఎదిరి రాణ్వా కిటకిటవుంది. వాళ్లసామికి రగ్తం వుచ్చం లేదూ? అద్మీ అద్మీ నిండి ఆరథం వుంది బురుజు. అక్కడ ముత్యాలపాపయ్యంట వాళ్లకి సర్దార్. వాడు సింహం వున్యాడు సర్దార్. వాళ్లదీ పట్టాకత్తులు మనదీపాల్మతాబులో తళ్తళా తళ్తళా తళతళ్తళా మెర్గుతుంది, అది తళ్తళా మన కన్నుకీ గుచ్చుకొంటుంది, మనకీ కబోదీ చేస్తుంది. నచ్ఛత్రం అంతావఖ్ జాగామే చేరితే ఏమివుంది అదీ వుంది బురుజుమీద. [నిష్క్రమించును.

ప్ర.—[ప్రవేశించి] మవ్వాళ్లు బేతాళ్ బురుజు ఎక్కినార్. వాళ్లకి వాళ్లకి లగాలగి మరామరి. [నిష్క్రమించును.

బుస్సీ.—ఇక పర్వా లేదు. బొక్క పడక పోయినను, మనవీరులు లోపల ప్రవేశించి సర్వసంహారము చేయుదురు.

ప్ర.—[ప్రవే.] ముత్యాలపాపయ్యా పట్టాకత్తి మన చంద్రోజి మహమ్మదుకి కూడా లేదు. ఆ పాపయ్యచేతులో మన గూడూఖాన్సర్గయ్యా; దేదేఖాఞాగయ్యా; దాడీఖాఞాగయ్యా; జాజాబాయి, సుగ్గుమియ్యా, అడ్డూసాబు, బక్షీసుల్తాన్, పేష్పైల్మాన్, అందఱు సఫాయి.

[నిష్క్రమించును.

బుస్సీ.—ఎంత సాదనాలు చేసినవారయ్యా యీబొబ్బిలి బంట్లు!

చ.—[ప్రవే.] ముసేఫనాల్ హాతీకి దిగి, లగ్గాకీ యెక్కి, పాపయ్యతో కలపటమైనాడు. ఆళ్లకి యిద్దఱికీ లడాఖా, అందఱు లడాయి మాని చూస్తారు. ఇద్దఱున్నూ అంతర్వట్టీ, దొంతర్వట్టీ, నాగ్గేసి హాకాశపట్టీ లేశి, పార్వాపిట్టల్లాగ, అణ్ని దాటి ఈడు, ఈణ్ని దాటి ఆడు, పోతాడు. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఎంత సేపుకీ ముసేఫనాల్ ఆలస్యం చేయఁడే;

ప్ర.—[ప్రవే. హర్షముతో] సర్కార్ సలామ్, ముసేఫనాల్ తన పేరు చెప్పి ముత్యాలపాపయ్యని పేగులు వెళ్లబొడిచినాడు. వాడు నారాయణ నారాయణ అంటూ నేలకొరిగినాడు. [అని నిష్క్రమించును.

బుస్సీ.—బళీ! బళీ! ముసేఫనాల్!

ప్ర.—[ప్రవే. హర్షముతో] సర్కార్, ముసేఫనాల్ వాళ్ల జెండా తీసి, మనజెండా వేశినాడు. వాళ్ల నౌబత్తు తోసి మననౌబత్తు మోగిస్తావున్నాడు! [అని నిష్క్రమించును.

చ.—[ప్రవే.] అరే! రే! రే! కొంగదారిని వచ్చినాడు రంగారాయుడు ఆ బురుజుమీదికి! పట్టాకత్తితో ఊడుస్తాడు బురుజంతా, ఆయనకి కోసం బతేకొంగడాలు వేశినారు. 'బొబ్బిలియేటు సూడు, యెలమపోటు సూడు, రంగారాయఁడి రణరంగము సూడు.' అంటా యేస్తాడు. అంతా తిరువణ్ణామలై దీపోచ్చం అయింది. ఆయన పైమూం

వున్నాడు సర్కార్! తుపాకీ వున్నాడు! ఇక్కడ వున్నాడు! అక్కడ వున్నాడు! ఇక్కడ లేడు! అక్కడ లేడు! అక్కడా యిక్కడా కూడా వున్నాడు! మళ్లీ ఇంద్రజాలం వున్నాడు, మళ్లీ కంటికి కాన్పిస్తాడు, గుటికి కాన్పడడు. అయ్నా ఎక్కడ కన్పడ్తే అక్కడ ఈరాజాగారి దం డంతా శరణు చెప్పేవాడు, దండం పెట్టేవాడు, దద్దిరిల్లి కందకంలో పడేవాడు. అయన సొంతచేతిలో కత్తితో నరుకుతాడు; గాలి నఱుకు తాడులాగ నరుకుతాడు. మంచి మంచి సిపాయి ఆయన్కి కొట్టడానికి పోతాడు, సలాం చేస్తాడు. ఆ షూర్మాన్ ఆద్మీ ఆద్మీకి గొంతు కోసి తల్లకిందు చేసి, నెత్తురువానలు కురిపిస్తాడు. నిలువు పెండ్యాలు ఆయన్కి చుట్టు బౌతుఖానాలు. అవే నెత్తురు చిచ్చుబుడ్లు ఆయన్కి చుట్టు. [అని నిష్క్రమించును.

హైదరు—సర్దార్, నేను మళ్లీ యెల్లి చూశి వొస్తాన్.

[అని నిష్క్రా.

బుస్సీ—ఎంతసేపు ఆడఁగలఁడు ఈదొమ్మరియాట ?

తృ.—[ప్రవే.] సర్దార్, రంగారావు ముసేఫనాల్కి ఐదుకీ ఆఱుకీ వఖ్ గుదిగా ఈ టెపోటుచేసి కందకంలో కూల్చినాడు. అతని ఎడమ్కాలి తన్నుతో మనధంకా ఆకాసానికి బోయింది. మనఘొజుకే ఎవడి తల్కాయమే పడింది, అతని జెండా ఎగురుతుంది. ఇప్డు అద్దో ఆహోగేది ఆయన్ది నగారా. [నిష్క్రమించును.

బుస్సీ.—బళీ; బళీ; మహావీరుఁడు !మహావీరుడు! ఆయనతో మనకు యుద్ధము కంటె సఖ్యమయిన బాగుగా నుండును.

ప్ర.—[ప్రవే.] మనిసర్దార్లు పదితూర్లు తెల్లజెండా యెత్తితే 'మీ రేమిరా ఆడ పిల్లలా?' అంటూ, అతనిబంట్లు యెఱ్ఱజెండా లెత్తినారు.

[నిష్క్రమించును.

బుస్సీ.—వా! వా! బలారే !

ద్వా.—[ప్రవే.] మళ్లీ బేతాళం బురుజు మీదికి నడిస్తే, ఎవరు పోవడం లేదని తిర్గుబాటు చేస్తారు.

బుస్సీ.—హైదరుజంగును నడుపు మను. [ద్వా. నిష్క్రమించును.

[హైదరుజంగు చినిగిన నగారా కుండ నెత్తికి తగుల్కొని
యుండ రక్తవస్త్రములతో ప్రవేశించును.]

బుస్సీ.—ఎవర వోయి నీవు, ఇట్లు పెద్ద జిన్ వచ్చినట్లు వచ్చుచున్నావు?

హైదరు.—ఏం సర్దార్, నాకీ తెల్వదూ మీకి? మన నగారాకుండ రంగారావు ఎడ్మాకాలితో తన్నితే, ఎగిరి వచ్చి నాతల్కాయమీద పడి, చిన్గి నచ్చుకోని వుంది. తల్కాయ లాక్కోవడానికి రాకుండ వుంది.

[నౌకరులు హైదరుతలనుండి కత్తితో తోలుం గోసి కుండం దివియుదురు.

బుస్సీ.—ఆశ్చర్యము! అది నీతలకాయమీఁదనే పడవలయునా!

ప్ర.—[ప్రవే.] సర్దార్, రాజా తమ్ముఁడు వెంగళ్రావు కోటబైటికి, 500 బంటు 150 గుఱ్ఱంతో వదలినాఁడు, కొండబోటు మీదుగా మన డేరాలమీదికే వస్తావున్నాఁడు.

బుస్సీ.—దారిలో మన గుఱ్ఱపు దండు వున్నది. పర్వా లేదు.

[ప్ర. నిష్క్రమించును.

చ.—[ప్రవే.] సర్దార్, వెంగళ్రావుకి మనగుఱ్ఱం ఎదుర్కొన్నది. 2000 గుఱ్ఱం సఫాయి. ఆయున్ని, 100 గుఱ్ఱం, 150 మంది సిబ్బంది మర్గయా. ఆయన ఫిరంగీలందు వస్తుంది లాగా కొండబోటు మీదుగా వస్తున్నాడు.

బుస్సీ.—పర్వా లేదు, అక్కడ నున్నది ఫిరంగీల యనుపు.

[చ. నిష్క్రమించును.

బుస్సీ.—[స్వగతము] ఏమి యాశ్చర్యము! ఇంత గుఱ్ఱపుదండు వాళ్లమైనందులకు నైజాముగారికి ఏమి చెప్పగలము?

ద్వి.—[ప్రవే.] సర్కార్, వెంగళ్రావు 50 గుఱ్ఱాలు 350 కాల్బలంతో కొండబోటు మీదికి రాగానే, వాటిమీదికి ఫెళ్ ఫెళ్, ఫెళ్ ఫెళ్, మోగినయి మన జజాయీల బార్లు. ఢామ ఢామని అగాదయినయి మన ఫిరంగీల బార్లు. 50 గుఱ్ఱాలు సఫాయి! 150 జనంతో మొదట మీకొడికి రాయబారం వచ్చినాడే దర్మారావు ఆయన కూలి పోయినాడు.

బుస్సీ.—అది చాల మంచిది మనకు. [ద్వి. నిష్క్రమించును.

[బుస్సీ డేరాపై గుండ్లు పడును.

బుస్సీ.—అరే! ఇదేమి మాడేరా మీదికి ఫిరంగిగుండ్లు? ఎవరు కాల్చినవి? అపాయముగా నున్నదే!

ఒకకింకరుఁడు.—[ప్రవేశించి విజయరామరాజు నుద్దేశించి] దండం మహాప్రభో! ఏలినవారి డేరామీద ఫిరంగిగుండ్లు పడుతున్నయి. డేరా కాలిపోతా వుంది. పదిమందికి గాయాలైనయి.

రాజు.—[స్వగతము] ఇవి ఎట్లు వచ్చినవి మా డేరామీదికి? వారికి ఫిరంగులు లేవే? [ప్రకాశము] పోయి అరుప్పుఁడు. [కింకరుఁడు నిష్క్రమించును.

ప్ర.—సర్కార్, వెంగళ్రావు అగాదు మీదుగానే ఫిరంగీలపై పడినాడు. మనఫిరంగిబార్లకి వెనక తిరిగి వచ్చి పటాలరాముడు వాటిమీద దుమికినాడు. ఇద్దఱు వెయ్యిమంది జనాన్ని ఫిరంగి బారులవాళ్లకీ అందరికీ పొడిచి, నఱికి, చంపి, ఆఫిరంగులే అడవికి పారిపోయి మళ్లీ వస్తావున్న మనఫౌజుమీదికి తిప్పి కాల్చి ఫౌజనంతా నాశంచేశారు. మీడేరాల మీదికి కూడా తిప్పినాడు. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఇప్పుడు ఫిరంగిగుండ్ల కారణము తెలిసినది. అయినను భయము లేదు. దారిలో అరా బున్నది.

తృ.—[ప్రవే.] సర్దార్ 200 మందితో వెంగళ్రావు, పటాలరామయ్య, తుపాకి-మందు పరికినమైథానం మయానికి దుముకగానే

ము సేటుక్కెత్తాక ఆ రాజుకి నిప్పు పెట్టివ్యాను. దొర, రామ్యు, వారి గుఱ్ఱాలు, వక మన్సి తప్ప అంతా భగ్ భగ్. [నిష్క్రమించును.

బుస్సీ.—ఇఁక పర్వాలేదు, ఒంటిగాండ్రు ఏ రేమి చేయఁగలరు?

ప్ర.—[ప్రవే.] సర్దార్, పటాలరాముడు లాడుఖాఁ కలిపట్టైనారు; గుఱ్ఱాల మీఁదనే పరవళ్లు పోకొట్టారు. లాడుఖాఁ చేతి యీ పెపోటికి రాముడుచచ్చి పడిపోయినాఁడు. వెంగళ్రావుగారి యీ పెపోటుకి లాడు పడిపోయినాఁడు, బదికేవున్నాఁడు. [అని నిష్క్రమించును.

బుస్సీ.—మంచిది.

రాజు.—[స్వగతము]

క. తురకలవీరులు పలువురు
మరణంబుం బొందినారు! మాటికి నన్నుఁ గా
గరకర కినెదరు ఖానులు?
గిరిని బిడుగు లట్లు నన్నుఁ గెడపుదు రేమో? ౬౭

వెంగళ్రావు.—[ప్రవేశించి రక్తవస్త్రములతో గాయములతో అతి క్రోధమున] ఎక్కడరా ఆ విజయరాముఁడు? ఏఁడిరా విజయ రాముఁడు? [ఎల్లవారును సంభ్రాంతులై లేతురు.

రాజు.—వెంగళ్రావు! [అని కేక వేసి గునగున పలాయితుఁ డగును.

వెంగళ్రావు.—నన్ను తప్పించుకొని పోఁగలవఁటరా? [అని తఱుము ను; బుస్సీలోనగువారు వెంగళ్రావును పట్టుకొని ఆఁపుదురు; హైదరు జంగు దూరముగా నుండి చూచు చుండును. వెంగళ్రావు మూర్ఛితుఁడై పడిపోవును.]

బుస్సీ.—హాహా! హాహా! లేవవయ్యా మహావీరుఁడా. లే వీరలోకాలంకారమా లే. [వెంగళ్రావు మూర్ఛ తేరును.

బుస్సీ—సేవకులారా, ఈయనను వైద్యశాలకుం గొనిపోయి రాజా వలన ఈయనకు అపాయము రాకుండ చూచుకొనుచు, మందు లిచ్చి, మాకుఁ దెలుపుఁడు. [సేవకులు వెంకట్రావునుం గొని పోవుదురు.

బుస్సీ.—ఇట్టిమహావీరులతో ఏల పోరు పెట్టుకొంటిమి !

సేవకులు—[ప్రకా] సర్కార్, ఆయన తేరినాడు ? పకరిచేత చావతలిశిన ఖర్మం మాకేమి ?' అని పలికి బాకుతో అొమ్ములో పొడుచుకొని కాలంచేశినాడు.

బుస్సీ.—జిహోవా ! జిహోవా ! ఈబొబ్బిలి సూర్యచంద్రులలో చంద్రుఁడు ఈయస్తగిరిం గ్రుంకి నాఁడు ! రండి, మనమందఱము పోయి ఆ మహావీరుని చూతము. ఎన్ని గాయములు తగిలినవో, ఎంత బలాఢ్యుఁడో, ఎట్టియాకారమువాఁడో, చక్కఁగా చూతము. ఆయనను చూచి నేను మా దేశమున మా ప్రభువుల యెదుట ఆతని రూపపరాక్రమములను వర్ణించెదను. [అందఱు నిష్క్రమింతురు.

# షష్ఠాంకము.

[రంగారాయఁడు పెండ్లికుమారులతోను ఇతర బంధువులతోను, దళవాయులతోను, సపరివారుఁడై నిండోలగంబుగా ప్రవేశించును.]

రంగా.—చెలికాని వెంకయ్యా, మనము బురుజు దిగి వచ్చుచున్న పుడు, పరాసు వానిడేరాకు కొండబోటునకు నడుమ కొండంత మంట ఎగసి మాయమైనదే, అదేమి? నల్లమందు పఱపా?

చెలికాని వెంకయ్య.—అవును మహాప్రభూ. దానిలక్షణ మట్టిదే.

రంగా.—అచట వెంగళ్రావు పోరుచుండెనా?

వెంక.—అట్టి దేమి లేనిచో ఏల నల్లమందు మారమ్మ అట్లు మండును?

సభ్యులు.—ఈ నల్లమందు మారమ్మమందు ఆఁగలేక యున్నాము బాబూ!

రంగ.—మాయదృష్ట మెట్లున్నదో?

[అంతట నల్లఁబాఱిన మానిసి యొకఁడు వడివడిగా, లేచుచు పడుచు ప్రవేశించును.]

నల్లమానిసి.—దండం మహాప్రభో, దండం, యెంగళ్ బాబు యీరస్వార్గంయెల్లినారు బాబూ.

రంగ.—హా! హా! హా! [అనిమూర్ఛిల్లి, తేరి, అరసికొని,] నీ వెవరవురా?

నల్లమా.—నేను వారి బంటుని, జక్కణ్ణి, ఖబురు చెప్పడానికి మిగిలుండ మంటే మిగిలి వచ్చినాను బాబూ.

రంగ.—మాతమ్ముఁడు మా కేమియును చెప్ప లేదటరా?

జక్కు.—అన్నయ్యగారు నా యింటికాడ నూడరైరి గదా అన్నారు బాబూ, నేను శెప్తానని మనవి చేసుకొన్నా.

రంగ.—ఏమిరా ఎట్లు పోయినాడురా నా తమ్ముడు?

జక్కు.—చినబాబు కొందరాయావాళ్లో సత్తాలని గెంటుబోలని సవార్లతో తెగ నరికినారు. 1000 ఫిరంగీలు వాళ్లనికలిపి ఆఫిరంగీలు పరాసులమీదికి తిప్పించి కాల్పించినారు. ఇప్పటికి మిగిలిన మాతో ఆళ్ల శేరాలమీదికి వురికే తలికి నడుమ గుళ్లుమంచు మా బిస్తుకులంతలో అంతా అయిపోయినాం. చినబాబూ నేను మిగిలినాను. అనక బుస్సీ డేరాలోకి విజయరామరాజు కోసరం యెల్లి అయన్ని తరుముకొని పోయిరి. చినబాబు మూర్ఛపోయినారు. ఆళ్లచేతులలో తప్పిరిల్లి అళ్లు ఎంత బతిమాలుకొన్నా యినక, రాజాని వొదలనని లగువు చేసిపడి యీరస్వర్గానికి యెల్లినారు, బాబూ.

[అని సొమ్మసిల్లి కూలును. నౌకరులు వాని బయటకిం గొనిపోవుదురు.

రంగ.—[తెచ్చువడియుండి] హాహాహాహా! ఎప్పుడును నా యను చరుఁడవుగా నుండువాఁడవు; ఇప్పుడు నాకన్న ముంగు నీవు ఎట్లు వీర స్వర్గమునకు వెళ్లితివయ్యా! హాహాహాహా! నా యాదృష్టము!

రంగ.—అన్నలారా, పడవాళ్లారా నాకుడిభుజము విఱిగిపోయి నదే! ఇఁక నే మున్నది! వెంగళ్రావు పోయిన పిమ్మట ఇంక నేమి బొబ్బిలి!

[ఫిరంగియగాడులు, నౌకరులు సంభ్రాంతులై ప్రవేశింతురు.]

నౌక.—మహాప్రభో, పరాసుల ఫిరంగిగుళ్లు వొచ్చి కోటలోసంతా పడతావున్నయి, లోగిళ్లు కూలిపోతావున్నయి. గుళ్లదెబ్బలకి మన నౌఖత్తు వాళ్లు నాశమై పోయినారు. మనజెండా ఏమయిందో తెలవకుండా యెగిరి పోయింది.

[రంగారాయని ప్రోల దివాణములో ఫిరంగిగుండ్లు పడును.

రంగ.— హాహా! అయ్యా, పెండ్లికుమారులారా, ఓబంధువులారా—

సీ. పెండ్లికై విచ్చేయఁ బిలిచికొంటిని మిమ్ము;
నిటు నిట్టు లగు నని యెఱుఁగనైతి!
మరణమునకై మిమ్ముఁ దోడు వేఁడఁగలేదు,
దైవంబు మా కిట్టు దాయ యయ్యెఁ.
శుభముఁగూర్చియే కదా సులకలు వచ్చిరి,
వారికి మీమీఁద వైర మేమి?
వారికి సామగ్రి జయసేసి కైకొని
సకుటుంబముగ మీరు సాగిపొండు

ఆ. ‘పెండ్లికతమున మేము బొబ్బిలికి వచ్చి
యేఁగుచున్నార’ మనినఁ, బోనిత్తు మిమ్ము.
మిగిలియుండుఁడు నేమాన మీరలేని;
మాకొఱకు మీకు సంఘాతమరణ మేల? ఉరా

[పెండ్లికుమారులు రాజబాంధవులు అందఱు ఉగ్రవీక్షణులై నిక్కి).

రంగ.— వెంకయ్యా, ఏమి? వీరు బదులు చెప్పకయే లేచిపోయి నారు?

వెంకయ్య.— మహాప్రభూ, వారి గాంభీర్యము మీకు తెలిసినదే గదా?

ఆ. ప్రాణ మిచ్చునట్టి బంధులు గావునఁ,
బ్రాణబంధుసంజ్ఞఁ బడసినారు;
మిత్తి నైనఁ బోర మీకై పోఁదుచువారు,
తొడుగు తొలఁచుకొఱకుఁ ద్రోలఁగినారు. ఊన

రంగ.—ఆహాహా! ఏమి వారి యుద్ధనైపుణ్యము! ఏమి తెగువ! శాస్త్రం గూడ వారు మార్గదర్శకులైరే. నాకును స్వయముగా వధింపవలసిన తొందరలు కలవు గదా? అంతఃపురమునకు వెళ్లి వారిని చూచెదను.

వెంకయ్య.—ఏలినవారు ఇటు దయచేయుదురు.

[రంగ-వెంకయ్య-నిష్క్ర.

స్థలకము.—అంతఃపురము.

[పెండ్లికొమారితలు, మల్లమ్మదేవిగారును ఉపవిష్టలై ప్రవేశింతురు. పెండ్లికుమారులుసంభ్రమమున ప్రవేశింతురు. పెండ్లికొమారితలు లేతురు.

మల్లమ్మ.—ఏమి నా ప్రాణములారా! ఇట్లు మీ రొక్కుమ్మడి అంతఃపురము ప్రవేశించిన కారణమేమి?

పెండ్లికుమారులలో నొక్కడు.—[illegible]! ఇంక ఏమి కడపటి దండములు. వెంగళ్రాయనింగారు వీరస్వర్గమునకు వెళ్లినారు. రంగారాయనింగారు కోటవెలుపలకు రాజుతోను, పరాసులతోను, కలియబడుటకు తరలుచున్నారు. పరాసులు బొబ్బిలి కోటను కూల్చుచున్నారు. మరి యే మేల వచ్చితిమో తమకు చెప్పవలయునా?

[వెంగళ్రాయని భార్య సుభద్రమ్మ శోకించును.

రాణి.—అమ్మా, సుభద్రమ్మా, నాబంగారు చెల్లెలా, నీప్రాణేశ్వరుడు రవంత ముందు పోయినందులకు దుఃఖించెదవా? ఈసమయములో మనకు దుఃఖము పనికిరాదు నాకూనా. నాపెండ్లికొమారితలారా! మా ప్రాణేశ్వరులతో మీ ప్రాణేశ్వరులు వీరస్వర్గమునకు తరలియున్నారు. మన మిపటికి ముందుగాఁ బోయి వీరు విజయంచేయు సమయమునకు గృహోత్సాలంకారములు గావించుకొని వీరికి స్వాగతము చెప్పవలదా? ఎవరి వారలను వారు, తొలిచూపే కడసారి చూపు చూచుకొని, తొలిదండమే కడసారి దండము పెట్టి, ముందుగా తరలుఁడు.

[పెండ్లికొమారితలు భర్తలకు ప్రణమిల్లి లేచి వారిబాహువులం గైకొందురు.

[నేపథ్యమున]

'గోవింద, గోవింద, నారాయణ, నారాయణ.' [అందఱు ఆకర్ణింతురు.

రాణి.—అహా! పెద్దవారు అందఱు మనకన్న ముందుగానే తరలినారు! వెనుకఁ బదుకుట మనకు అవమానము గాదా? ఇదిగో నాకు నా ప్రాణేశ్వరులు ఇచ్చిన బాకున్నది. సుభద్రమ్మకు వెంగళ్రావు ఇచ్చి బోయిన బాకున్నది.

స్త్రీలు అందఱు— (గేయము.)

భారతీ దేవిరో, భార్గవీ దేవిరో, పార్వతీ దేవిరో;
దీవింపుఁ డీమమ్ము దీనలను మాయ ధీనలను దల్లులార!
వీరపత్నుల మమ్ము వినక కనక ముందే
విడనాడు చున్నట్టివీరే;
ప్రతిజన్మ మందుమా ప్రాణనాథులుగాఁగ
వరమొసం గుఁడు తల్లులారా!
మాకిట్టి వంతలు మరలరా కుండఁగ
మముఁగావుఁ డీతల్లులారా!
కడపటి మా మ్రొక్కు గైకొని మామీఁద
కనికరింపుఁడు తల్లులారా!

[అని బాకు లొమ్మునకు గుఱిచేసికొని]

రంగరంగ శ్రీరంగారంగా కావేరి రంగా
కమలా కాంతా మనోజ్ఞ భృంగ కస్తూరి రంగా.

[అని పాడుచుకొన సంకీంతురు. తెర వ్రాలును, తెరలో "గోవింద గోవింద, నారాయణ నారాయణ" పెండ్లికుమారులు బాకులు తుడుచు కొనుచు పూర్వస్థానమునకువత్తురు. ఇతరులును అట్లే వత్తురు.

[రంగారావును అట్లే ప్రవేశించును.

రంగ.—అయ్యలారా, మాయన్నలారా, మాతమ్ములారా, సాబం గారులారా,

సీ. విజయ బంధువులార, వేజన్మముల కైనఁ
దీర్చుకో నేర మీ పేర్చు ఋణము.
చేతు లారంగఁ బూజించితి మెవ్వారి,
ఖండించితిమి వారి ఖడ్గధార!
లీలలు మీర లాలించితి మెవ్వారి,
బడఁగ్రుమ్మితిమి వారి బాకుమొనల!
ఆడుఁబుట్వు లేదు! హతమయ్యె మగకూన!
కోట పా డయ్యె నింకేటి కిచట!
తే. నాదు ప్రాణంబు వెంగళ నాయకుండు
న న్నెదురు సూచు చున్నాఁడు కన్ను నొవ్వ,
అరుల బొందుల మీఁదుగా నతనికడకు
క్షణములోఁ జేరుదము రండు రణపథమున. ౩౧

[వెంకయ్య ప్రవేశించును.

రంగ.—వెంకయ్యా, ఏమిచేసి వచ్చితివి?

వెంకయ్య.—మహాప్రభూ! ఎల్లవారితోడుగులు వదలించి వచ్చితిని.

సీ. వరవుడులుం గూడ వలసపో నొల్లక
యిటనె యీల్గఁగ నిశ్చయించుకొనిరి!

పండ్రెండును బడాల వారి గృహంబులు
ఖాలి సేయించి యుద్యాలముగను
తెలగా పడంతుల, వెలమ వడంతుల,
లోనికిఁ దోలి, తల్పులు బిగించి,
తోరంబుగా నన్ని చూరుపట్టెల వెంటఁ
జిచ్చులంటించి, నేవచ్చినాఁడ.

తే. గవను తెరచి మనము గడచునప్పటికి భూ
చక్రమునకు నాక చక్రమునకు
మంటయిరుసు గూరి మనకంటి కగపడు,
నేల తడయ నింక నేలినదార.　　౭౨

రంగ.—[ఆత్మగతము]

తే. విజయరాముని కోర్కెయే విజయ మొందె!
పాపి పింజారి హైదరు పలుకె నెగ్గె.
బొబ్బిలిగడీని బాడిడి పోటు మగఁడు
రంగరాయండు వెడలె గౌరవము దక్కి.　　౭౩

ఆహా! ఆహా! ఆహా! [ప్రకాశము.] వీరాగ్రణులారా! మనము పరాసుల తేరామీఁదికే పోదము; మఱి తరలుఁడు. గోవిందా, హరి గోవిందా.

[అందఱు 'గోవిందా హరి గోవిందా' అని అఱచుచు
విటకముగా నిష్క్రమింతురు.

---

# సప్తమాంకము.

స్థలము:—బుస్సీ డేరా.

అంతట బుస్సీయు విజయరామరాజు ప్రభృతులును ప్రవేశింతురు.

బుస్సీ.—[సంభ్రమమున] రాజా, ఇదే మయ్యా, ఇంతవెల్తురు?

[రాజును బుస్సీయు పరిక్రమించి పరికించినట్లు అభినయించి కూర్చుందురు.

బుస్సీ.—ఏ మయ్యా ఆజ్వాల? కోటయంతటను మంటికి మింటికి అంటి యున్నది.

రాజు.—దొరగారూ, ఈ వెలమవాని గర్వము మీ కేమి తెలియును? బయట మనతో యుద్ధము, లోపల 50 పెండిండ్లు. ఈ జ్వాల యతని ప్రాణసంచాలమంట.

బుస్సీ.—ఏమి యాశ్చర్యము! ఏమి యాశ్చర్యము! 50 పెండిండ్లు! ఇదే సమయమని తెచ్చితిమయ్యా ముట్టడి! ఆహా! ఆహా!

ప్ర.—సర్దార్, రంగారావు 700 మంది సిబ్బందితో కోట నుంచి మీ డేరాల మీదికి దూకినాడు. వారితో లాలు ఖుసుం జాను అడ్డినాడు. అక్కడ వారికి వీరికి లగాయిగి మరానురి.

బుస్సీ.—లాలుతో చెప్పుము, రంగారావును ప్రాణముతో ఇక్కడికి తెమ్మని.

ప్ర.—సర్కార్ రాజ్ఞ. [అని నిష్క్రమించును.

[అంతట హైదరుజంగు, వేంకటలక్ష్మిని చినవేంకటరాయని జవానులచే పట్టించి తెప్పించి బుస్సీయెదుట నిలుపును.

బుస్సీ.—ఎవరయ్యా వీరు హైదరుసాహెబు?

హైదరు.—అయ్యా, ఈ బచ్చాకి తీస్కొని ఈమన్సి కోటకాడి నుంచి యెల్తావుంది. సోల్జర్లు అడ్డంవొస్తే, వరహాలు సల్లుతుంది. వాళ్లు వాట్కి రాజాయిలాయి యెట్బగ్లో యేరుకొంటా వుంటే, ఇది తప్పించుకొని పారిపోతా వుంది. వరాలుగిరాలు చూచి బొబ్బిలి జమిన్దార్ ఇలాఖా బచ్చాకీ తల్చి, అవిదొరకనివాళ్లు మనసిపాయీలు యీళ్లకి పట్టుకొని ఇక్కడికి తేబోతే, యిది ఖాకుకి దూసి లడాయి చేస్తుంది. 100 మందిని కుమ్మింది. చూడడానికి బాసీవుంది, సాముగరడీలకీ బురాక్ వుంది. పిల్లవాడికి తుపాకి వాత వేస్తామంటే అప్పట్కి యిది మమ్మల్కి సంపడం మానింది. మీరు మాటలాడ వొచ్చును.

బుస్సీ.—ఎవరమ్మా మీరు ? సంకోచము లేకుండ ఉన్నమాట చెప్పుఁడు. మీకు మేము మేలుపు చేయుదుము. ఇంత బీరము గల యాఁడు వారికి ఎవరైనను గౌరవము చేయవలసినది.

వేంకట.—అయ్యా, మీరే బుస్సీదొరగారని నాకు తోఁచుచున్నది. వారే విజయరామరాజుగారు. కానిండు. నేను బొబ్బిలి రంగారాయనింగారి జనానా దాసి జనము ముప్పది ముగ్గురిలో కలదానిని. ఈ కూన చినవెంకటరావు మాయేలిన వారికి ఒకఁడే కుమారుఁడు. ఈయనను ఈయనతల్లి మల్లమదేవి మన్నెరికొల్లి ఈ రాజుచేతఁ బడనీయక సామర్ల కోటలో చెల్లెలియిల్లు చేర్చుమని నాకు అప్పగించినది. నేను ఒప్పుకొని 'నాబొందిలో ప్రాణ ముండఁగా' బాలునికి అపాయము లేదని పలికి, బాపన బాలుని వేసాన కొనిపోవుచుండఁగా, మీ మ్రోలకు మమ్ము తెచ్చినారు. మీరు దొడ్డవారని వినికి. అటుపైని మీ చిత్తము.

బుస్సీ.—బళిబళి ! నీవు వారిపాలిటి ధర్మదేవతవు, మిమ్ము నేను రక్షించెదను.

రాజు.—గిళి గిళి ! ఈ బాలుని ఏనుఁగు కాలిక్రింద మట్టించి నేలఁగలపవయ్యా బూసీదొరా !

బుస్సీ.—ఏమి పాపాత్ముఁడవు రాజా! ఇట్లు పలికెదవు!

రాజా.—బొబ్బిలిపురుగు మిగిలిన, నిన్ను నన్ను ఇఁక నుంచునా?

బుస్సీ.—ఇంత ద్రోహము తలంచిన, నీ నెత్తిపైన దేవుఁడు పిడుగు వైచును జుమా. నాకరులారా! వీరిని గౌరవముగా విచారించుము, సుఖముగా, మా డేరాలోనే, మా పడుకగదిలో నుంపుఁడు.

[నాకరులతో వెంకటలక్ష్మి బాలుంగొని నిష్క్రమించును.

ప్ర.—సర్దార్; యుద్ధం మాని పది తెల్లజెండాలు వేసుకొని సమీపించి రాయనింగారితో 'వీరాగ్రేసరా, మీతో బూసీదొరగారు సఖ్యం కోరుతూ వున్నారు. మీరు ప్రాణంతో వారి దగ్గరికి విజయం చేయవలెను' అని కోరితే, ఆలాగే వస్తాము విజయరాముణ్ణి మా కాడిక పెస్తే, అందాకా పోరుతూనే వుంటాము; మీరు పోరుతూనే వుండండి.' అని మళ్లీ మన దండును రూపుమాపుతా వున్నారు.

బుస్సీ.—మరల పోయి ఆయనతో 'అయ్యా, మీకుమారుని బాలుని చినవెంకటరావును దాసివెంకటలక్ష్మి పామర్ల కోటకు కొనిపోవుచు మాకు పట్టుఁబడినది. వారిని మేము కాచియున్నాము. బాలుని క్షేమముగా మీ కందించెదము, సఖ్యము చేసికొన దయ చేయవలయును.' అని వేఁడుకొని తెండు. [ప్ర. నిష్క్రమించును.

చ.—సలాం సర్కార్, రంగారావు కుడి బుజం తెగిపోయింది. యెడ్మ మోకాలికి తుపాకిగుండు తగ్లి మోకాలుపగ్లి పోయింది. రగతం దూకుతూ వుంది. మండీ యేస్కొని యెనకాకీ ముందూకి పక్కలాకి యెడ్మచేతితో నఱుకు తాడు సాబ్. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఆయన యేమి యంత్రమా వీరుఁడా! హా! హా!

ప్ర.—సర్దార్, దగ్గిరికి వెళ్లడానికి గుఱ్ఱం చొఱడానికి సందు లేదు. రాణువ ఆయనకి చుట్టూ వెదురు పొద వుంది.

బుస్సీ.—[లేచి] అటయిన మేము వెళ్లి వారిచేసికొనియెదము. [రాజుంగూర్చి చిఱునవ్వుతో] మహారాజా, మీరు వచ్చిన ఆయన వచ్చునఁట గదా, మీరు కూడ రండి. [రాజు గుసగుసం బాటి నిష్క్రమించును.

బుస్సీ.—పంద! హేహే పోయెదను. [అని పరిక్రమించును.

చా.—సర్కార్, రంగారావు రక్తం గారికారి సొమ్మసిల్లి పోయినాడ్. మనవాళ్లు పట్టి ఎత్తబోతే తెప్పిరిల్లి మళ్లీసొమ్మసిల్లిన్యాడు. గుండెగాయంగుండా బొట్నవేలు దూర్చ్తే అంతరాత్మ లేచి పోయింది చెప్పిన్యార్. ఆమహాపురుషుడి దేదీప్యమానం రూపాన్ని గాలుప అంతా, మీద మీద పడి సూస్తావున్నారు సర్కార్; యేడుస్తావున్నారు కూడా. నేను వెంటనే మీకి చెప్పవెయ్యాల ఘన్క ఇక్కడ మీలోనే యేద్వడాన్కి వచ్చిన్యాను సర్కార్.

బుస్సీ.—అటయిన మేమును అక్కడనే చూచెదము. [అని లేచి తూర్పుదెసం బరికించి] ఆహా! సూర్యుఁ డుదయించినాఁడు! ఇతఁ డిచ్చట నిన్న సంజవేళ నేమి కాంచినాఁడు! ఇపు డేమిచూడవచ్చినాఁడు! కెంపెక్కిన యీసూర్యుని ఇతని చెంగటి యీ సాంధ్యమేఘములను గనఁగా నిట్లు తోఁచుచున్నది. వీరిమతములో యొమ్ముగాయముల వీరులు సూర్యమండలమును భేదించుకొని వీరస్వర్గమునకేఁగుదురు గదా. దానంజేసి.

ఉ. రావుకులాగ్రగణ్యునికి రంగమహీపతికిన్ బ్రియంబునన్
ద్రోవ యొసంగి త ద్రుధిర ధారణిచే రవి దాల్చె శోణతన్;
రావున కోహటించి లక్కలవరంబున గుంపులువడ్డ తక్కు ర
క్తావిల వీర కోటులు సుమా తరుణారుణ సాంధ్యమేఘముల్.

ఉదయించిన యీనభోమణిం గంటిని. పోయి అస్తమించిన యీధరామణిం గనియెద. [అందఱు నిష్క్రమింతురు.

## అష్టమాంకము.

స్థలకము:—బొబ్బిలికోట లోపల.

(బుస్సీ, విజయరామరాజు, హైదరుజంగు, ముసేపసాల్, పరివారముతో ప్రవేశింతురు)

హైదరు.—ఏమి ముసేపసాల్ బహద్దర్? ఈలూటీలో విస్తారం ధనం దొరికిందా మీకి?

ముసే.—ఎక్కువగానే దొరికింది, హైదర్సాబ్. ఈయాశ్చర్యం ఇనండి. మాదీ పాడు జీవనం. వకరిసావు మాకీ పెళ్లి, వకరినాశం మాకి హావిశ్వర్యం; మాదీ చావూ నాశం అలాగే ఎవరికో పెళ్లి హావిశ్వర్యం అయితుంది. వారిధనం మొత్తంగా మాకి ఎక్కడా దొరకలేదు. బుగ్గిఐన వల్లుతో బంగారపు జవాహారీ కరిగినపెళ్లలు దొరికాయి. కొన్ని ఇస్త్రీ శపాల్మీద విశేషించి జవాహారీ దొరికింది. ఖిల్లామే ధనం దాశిన సోటు అడ్డదానికీ వఖ నరపుడు గయిసా లేదు.

బుస్సీ.—స్త్రీ లేమయిసారు? ఒకస్త్రీ యైనను కోటనుండి తప్పించుకొని పోలేదు గదా!

ముసే.—స్త్రీ అంతా సచ్చి పడివుంది. కానా మంచి కాలిపోయింది.

బుస్సీ.—ఏమి యిది! పెండ్లి యని చెప్పినాడే యీరాజా!

ఒకసిపాయి.—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] నాకీ ఆయింట్లో దూరినదాన్కి కిఫాయత్ ఇద్గో నాదాడీ కాలిపోవడం.

[అని నిష్క్రమించును.

బుస్సీ.—ఏమి రాజా, యీవింతలు చూతము రండి.

[అని పరిక్రమింతురు.

రాజా.—[ఆత్మగతము] నాచేతను నాకనులారం జూచెదఁగాక,

బుస్సీ.—[పరికించి] యీ యిండ్లన్నీ కాలిపోయినవి! ఇంకను కాలుచునేయున్నవి [కాంచి] ఏమి యివి! కాలిపోయిన స్త్రీ దేహములు! [నిర్వర్ణించి] ఎక్కడను పురుషదేహము అగపడదు. [ఒండుచోటఁగాంచి] హా! యిక్కడ ఈపసికూన సోలి పడిపోయి, పాలు త్రాగుచున్నట్లు నోరు కదలించుచున్నది! [మఱియొకచోటఁగాంచి] హా! హా! ఇక్కడ ఈశిశువు చచ్చిన తల్లిమీఁద పడి పాలకై పీఁకుచున్నది! హా! హా! రాజా! ఈకోట లోని స్త్రీ లందఱు నీవు చేసిన ద్రోహముచేత గోహారు చేసినారా యేమి?

మునే.—అవును సర్దార్; అలాగే జర్గింది.

బుస్సీ.—ఏమి రాజా? ఇండ్లు కాలుచున్న మంటలను పెండ్లిబాణ సంచా అంటివే. ఎంత పాపాత్ముఁడవయ్యా!

రాజు.—[వినయతో] ఆ! నేనుమాత్రము చూచి చెప్పితినా యేమి? ఊరక నన్ను పట్టుకొని సివాలు మాటమాటకు.

బుస్సీ.—రాజా ఈపాపము ఎవరి దయ్యా?

రాజు.—ఏమి చేయను! మనదే.

బుస్సీ.—అది యెట్లయ్యా, ఉమ్మడిమాటగా పలికెదవు?

రాజు.—నాకు ఈజమీను వచ్చినది, మీకు పేష్కస్సుధనము వచ్చినది.

బుస్సీ.—లేదు, నీవు మమ్ము మోసము చేసితివి. నేను ఏతప్పయిన మన్నింతును గాని, మోసమును మన్నింపను. హా! హా! ఎంత మోసపోయితిమి! ఇందులకు శిక్ష రాజా, యీజమీనును మీకు మే మియ్యము.

రాజు.—[ఆత్మగతము] బెదరించె. [ప్రకాశము] ఈ పాపము నాయొక్కనిదే.

బుస్సీ.—అట్లు పలుకకు. 'మనది' అనకు. [సూక్ష్మశ్రవణ మభినయించి] ఏమి యిది తెంపులేని ఘంటానాదమువలె వినఁబడుచున్నది! హైదరుజంగ్, మీకు వినఁబడ లేదా?

హైదరు.—అదుగో యినండి. అరబ్బీరాత్రులకథల్లో కొండ మీద్కి అబంగారపు వున్నికి తేజోయేవాడ్కి రాయిరాయిన్ని 'చీచీ' యన్న చీవాట్లలాగ మనకీ యిక్కడ 'చీచీ' ఇనపడటం లేదా ?

ముసే.—అవు నవును. ఇంకా ఇంకా ఏమ్మేమ్మో ఇనబడతా వుంది.

హైదరు.—ఇప్పు డేమి చెప్తారు ? ఇంకా రాత్రయినకొద్దీ కోలాహాలం వుంటుంది. గుండెబద్దల్ అయ్యే షబ్దాలు ఇనబడుతుంది.

రాజు.—ఇన్నిచావులు అయిన యీ చోట శాకినీ డాకినీ బ్రహ్మ రాక్షస బేతాళులు పేటలాడుట ఆశ్చర్యమా ?

హైదరు.—నేలదేకినీ, నింగినాకిని, జిన్, పిసాసీ, సైతాన్లు కూడా. ఈటిభయానికే నేను రాత్రి నాడేరాబైటికి అడుగుపెట్టాన్ లేదు.

బుస్సీ.—మనమిక్కడ ఉండఁ దగదు. డేరాలకే పోదము రండి. మనకే మందుగుండ్లు లేకపోయిన, మనది 174000 సేనయు, యీబొబ్బిలి బంట్లు 2000 మందిచేత నాశమై యుండును. [అందఱు పరిక్రమింతురు.

స్థలకము:—బుస్సీడేరా.

బుస్సీ.—ఇదే మా డేరాలో కూర్చుందము.

[అట్లు చేయుట నభినయింతురు.

బుస్సీ.—ఎవరురా అక్కడా ?

నౌకరు.—సర్దార్, ఏమి సెలవు ?

బుస్సీ.—ఆ బాలుని వెంకటలక్ష్మమ్మను తోడ్కొనిరండు.

[నౌకర్లు అట్లే చేయుదురు. వెంకటలక్ష్మి బాలుని కుర్చీలో కూర్చుండఁబెట్టి నిలుచుండును.

వెంక.—బాబూ, దొరగారికి సలాము చేయుము.

బాలుఁడు.—సలాము బూచీ దొరగారికి [అని సలాము చేయును.

బూసీ.—[టోపీతీసి] సలాము చినవెంకటరాయనింగారికి — హైదరు సాహెబు, ఈయన నేమి చేయుదము ?

రాజా.—నేను నా కాల పుట్టినప్పటి నుండి సత్యమే చెప్పలేదా ?

బుస్సీ.—ఏమి పాపాత్ముఁడా. అట్లు పలికెదవు. బిడ్డలఁ గన్న వాఁడవు కావుగదా. ఆ నిసుఁగును చంపి అతని నోటియుండెడి యన్నమును హరించెదవా; నీది యెట్టి రాతిహృదయ మయ్యా !

రాజా.—అటువంటి మీరు నాకు చేసిన మేలు సున్న. వాఁడే నా ప్రాణానకు మృత్యువు.

బుస్సీ.—ఎట్లయ్యా ?

రాజా.—పరీక్షించి చూపెదను.

బుస్సీ.—నౌకరులారా, విశ్వపదార్థము లన్నియును, బాలుని ముందర పెట్టుఁడు. పుస్తకములు, కత్తి, కటారి, ఈఁటె, ఇంక వేఱుకైదువులు కూడ పెట్టుఁడు.

[నౌకర్లు అట్లే చేయుదురు.

బుస్సీ.— బాబూ, ఇందులో నీ కేమి కావలయునో దానిని తీసికొమ్ము. [బాలుఁడు పోయి కత్తిం గైకొని రాజు మొగముమీఁదికి ఎత్తును.

బూసీ.— బళీ! బళీ! బలారే! బలారే! తండ్రిపగ తీర్చుకొనెడి కుమారుఁడవు బాబూ, తుపాకికడుపున ఫిరంగిలాగున పుట్టినాఁడవు. (రాజు నుద్దేశించి) రాజా, నీపాపము నిన్ను త్వరలోనే కొట్టును గాని తప్ప దయ్యా. వేంకటలక్ష్మమ్మా! ఈరాజువలన మోసపోయి మేము అమహాత్ములకు చేసిన కీడునకు మితిలేనిదానికి కొంచెము పరిహారముగా, ఈ చిన్ని బాలుని నీతో సురక్షితముగా పంపెదను. ఎవరు రా అక్కడ ?

[నౌకరు ప్రవేశించును.

బుస్సీ.—ఈక్షణము పోయి, మా సేనల్లో సర్దారుతో మామాటగా చెప్పుము. 'నీవు మా పరంగి తురుపు 200లతో, సకలపదార్థములతో, సవారిలో ఈ వేంకటలక్ష్మమ్మను ఈచిన్న రాయనింగారిని, ఎక్కించుకొని, సామరకోటకు కొనిపోయి, తగిన మరియాదతో ఈయన పినతల్లికి అప్పగించి,

మా సలాములు చెప్పి, మమ్ము కలసికోవలసినది.' అనియు, 'దారిలో ఈరాజు ఏమయిన శిశువునకు అపాయము చేయుటకు పన్నాగము పన్నినా, దానిని నీవు హతము చేయవలసినది.' అనియు, 'ఇక్కడ రాజును క్షేమ భద్రముగా కాపు కాచెదము.' అనియు, చెప్పుము. వీరిం దోడ్కొని పొమ్ము. [అని బాలుని ఎత్తుకొని ముద్దిడి, పండిచ్చి, దింపి] బాబూ, పోయివచ్చెదవా?

బాలు.—పోయి వత్తాం, తలాం.

వేంకట.—సలాము దొరగారికి. ఒక మడుగులోనే మొసలియు, రాజహంసయు నున్నవి. అట్లే ఈ సేనలోనే ఈరాజున్నాఁడు, మీరును ఉన్నారు. మీ రన్నట్లు, ఈయనను, పాపము రొట్టును గాని మానదు. సెలవు పుచ్చుకొంటిమి.

[నౌకరు, బాలుఁడు, వేంకటలక్ష్మియు నిష్క్రమింతురు.

రాజా.—ఎవరురా అక్కడ మా నౌకరులు?

నౌకరు.—[ప్రవేశించి] జయము జయము మహాప్రభువుగారికి ఏమి యాజ్ఞ?

రాజా.—ఈక్షణమే పోయి, ఎల్లుండి తెల్లవారు నప్పటికి మా బాబును ఆనందరావును ఇక్కడికి బొబ్బిలి పట్టాభిషేకార్థమై సర్వ సన్నాహముతో తోడ్కొనిరండు.

నౌకరు.—చిత్తము ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

బుస్సీ.—ఇఁక మీరందఱు పొండర్యా; నేనును నారాయాందోళన తీఱునట్లుగా, ఏసుదేవుని గూర్చి పాతప్పులు మన్నింపు మని ప్రార్థనచేసికొని విశ్రమించెదను.

ఇతరులు.—సలాము, సలాము, సలాము. [అని నిష్క్రమింతురు.

బుస్సీ.— నేనును ప్రార్థనాపవరకమున కేఁగెద.

[అని నిష్క్రమించును.

[అష్టమ నవమాంకముల నడుమ]

ప్రవేశకము

స్థలము.—బొబ్బిలికోటలోపల.

[అంతట వెట్టివాండ్రు ప్రవేశింతురు.]

వెట్టినాయకుఁడు.—[చేత చేపాటికఱ్ఱ బట్టుకొని నిలుచుంబడి, శవములను బండ్ల కెక్కించుట నభినయించుచు] యెత్తోడిబడుకు యేం బదుకురా నారాయుఁడా! ఎత్తండిరా ఈ పీనుగలని, బళ్లలోకి.

[ఇతరులు అట్లు చేయుట నభినయింతురు.

వెట్టినాయకుఁడు.—అయరె మజ్జా! యేమి శిత్రంరా! మనము పది బారలదూరాన వుండాలిశిన యీ ఆడోంగులు రానివోసాలు, యేనిగలమీద బంగారపు అంబారీలలోను బంగారపు సవ్వారీలలోను తిరగాలిశినవోరు, మనశాత దున్నపోతులబళ్లల్లో, యీడ్పులు పడి, గోతులలో పడతా వున్నారు; ఏంకమ్మ నొచ్చిందిరా యీళ్లకి! ఇదేలా గుం దంటే:—

[గేయము.]

హరిహరీ నారాయ ణాదినా రాయణో
కరుణించ వోయమ్మ వ్ము కమల లో శనుడా.
నిన్నరా తిరి కోట మొన్నరా తిరికోట
వన్నెవిరా రినకోట వశినపుర మాయెగా. హరి॥
శిన్నమ్మ యిన్నాలు శిందులూ తొక్కితే,
పెద్దమ్మ పరవళ్లు పెడ తున్న దిపుడు హరి॥
పెద్ద మెల్లా దంట, శిన్న మొస్తా దంట,
వశినపురమూ మళ్లి వన్నెకె దంట. హరి॥

ఏమొగం పకపక యెగిరెగిరి నవ్విందో,
ఆమొగం యెక్కెక్కి అంగలార్చింది. హరి॥
ఏ మొగం యెక్కెక్కి యేడస్తవుంటదో
ఆమొగం నవ్వింది అబ్బరంగాను. హరి॥
రంగరా వెళ్లాడు, శింగార మెల్లిందె,
ఆనందరా జింక ఆడతో డంట. హరి॥
ఆనందు డిక్కడ ఆడడానికి వొస్తె,
యెల్లిన శిన్నమ్మ యెంటొస్త దంట. హరి॥
అమ్మ లిద్దరితోత యిమ్ములూ కుమ్ములూ
నరమాన వులనొస్థ నలవ రా శినదు. హరి॥

[అంతట చాటింపు వెట్టివాఁడు ప్రవేశించును.]

చాటింపు.—ఎందుకన్నా యిక్క డంతా సుబ్బరం శేయిస్తా వున్నావు ?

వెట్టినాయ.— లేవు ఆనందమారాజుకి యీడ పట్టం కడతారంట; అందుకోసంరా! నువ్వెంట్రా సాటించ నెల్తావు ?

చాటింపు.—నాను ఆనందమారాజుకి యీడ పట్టాబిసేకానికే ఊరంతా అలంఖారం శెయ్యాలిశిం దని సాటించ నెల్తా. సూశినావా అన్నా శిన్నమ్మ శపలశిత్తం ?

వెట్టినా.— (జనాంతికము) మఱి గంటే, వోరే ! నువ్వు నిన్నటిదాక రాయనింగారి వుప్పు తిని, ఇప్పుడు ఆనందరాజుకోసం సాటిస్తావేంట్రా ?

చాటింపు.—(జనాంతికము) నువ్వేలా గన్నా ఆనందరాజుకోసం సుభ్రం శేయిస్తావు ?

వెట్టివా.—(జనాంతికము) పాపారాయనిం గారికి కబు రెల్లింది; నాతమ్ముడే తీసకెళ్లాడు. రాత్రి అయు నొస్తాడు. పెదరాజుకే పట్టం గడతాడు. (ప్రకాశము) ఈ కంపుకి నిలవలేకున్నానురా. ఈబళ్లు తోలించుకెళ్లి కొంచెం నీలుమ్పుకొంటా.

చాటింపు.—నా చెల్లి యెక్కణ్ణయినా మానులు మిగిలున్నకాడ నా చాటింపు సాచే శొచ్చి నీలకాడ నీతో కలుసు కొంటానన్నా.

[అందఱు నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

# నవమాంకము.

స్థలకము.—స్కంధావారములో విజయరామరాజు డేరాకడ.

[తాండ్ర పాపారాయఁడు మిరియాలసీతన్నయు ప్రవేశింతురు.]

సీతన్న.—వచ్చితి మయ్యా పాపయ్యా విజయరాముని డేరాకు. అందఱు బాగుగా నిద్రపోవుచున్నారు. పూర్వము, అశ్వత్థామ సౌప్తికము చేయలేదా? అయినను మనము నిద్ర మేలుకొలిపియే చేయుదము. నేను బయట కాపుండెద, డేరాకడకు వచ్చినవారి నెల్ల క్రుస్కు-మిస్కు అన నీయక పరిమార్చుచుండెద. బుస్సీని రప్పించుటకు వీరఫిరంగులు వారి డేరాల మీఁదికి అగాదు చేసెదను. నీవు సావకాశముగా రాజానకు జముని బేటి చేయింపుము. లోనికిం బొమ్ము.

పాపయ్య.—సరి, సీతన్నా, అట్లే కానిమ్ము.

[సీతన్న నిష్క్రమించి డేరాద్వారము కడకు మరల మరల వచ్చుచుం బోవుచుండును.

పాపయ్య.—బళీ! మిరియాల సీతన్న పనిచే బుస్సీ వచ్చి నాపనిం జూచును గాక. వీఁడు నేను లేనప్పుడు గదా, నారాయనిని హతము చేసినాఁడు. నేనిపుడు వీనిని, బంధు మిత్ర పరివార బల త్రితయ సమేతుని హత మార్చెదను. వేనవేలు వీరభటుల చేతఁ గదా వీఁడు నారాయనింగారులను, ఒంటరులను ఒక్కొక్కని వధియింపించినాఁడు. నేను ఒక్కండనె వీనిని వీనిం గావ వచ్చెడువారినిం గూడ పరిమార్చెద. హాహాహా! ఏమి కనఁబడుచున్నది!

శా. రంగారాయఁడు, వేంకటేంద్రుఁ, డనుఁగుల్,
రౌతుల్, భటుల్, రక్తది

గ్ధాంగుల్ నఖ మిడికన్నులం గనుచు జి
హ్వాల్ ద్రోఁప నోళ్లిచ్చి, కా
ళింగుం జూపి, తృషం దదస్త్ర ఝర పా
ళిం దీర్పు మన్సంజ్ఞ గాఁ
గం, గైదోన్నె ఘటిం త్రయారె ! యిదె రం,
గా వెంగ, నేఁ దీర్చెదన్. ౭౫

**హా ! మరల ని దేమి ! హా !**

క. ఈతని ద్రోహమువలనన్
గాతర లై యగ్నిఁ బడిన కంజాతాస్యల్
చేతుల సన్నలచే నను
నీతని మెడఁ గోయు మనుచు నెగచెద రరరే ! ౭౬

ఇఁక తడయంజనదు. నిద్రపోవుచున్న యీమూఁకను మదీయ సింహగర్జనములచే 'ఓరి, వచ్చి మీరాజుం గావుఁడొండిరా,' అని పిలుతునా? వలదు,; అట్లు చేసిన వీఁడు నారాక యెఱింగి పలాయితుఁడై దాఁగును. కావున లోనికే పోయి వచ్చినపని కావించెద.

ఆ. ఏనుఁగునకుఁ దుల్య మితని దేహము గాన
మేటి శిరము వ్రచ్చి మెదడు వడయఁ
గుత్తుకను బగిల్చి నెత్తురు వాఁకను బొంద
నేను సింహ మవుదు నీక్షణమున. ౭౭

[అని లోనికిఁ బోవుట నభినయించి, చాటును దూఱును.

[అంతట ఒక సేవకుఁడు కునికిపాట్లు పడుచు, పాదము లొత్తు చుండ, మంచముపై నిద్రితుఁడు రాజు ప్రవేశించును.]

పాపయ్య.—(రాజుం దఱిసి) పులి! పులి! పులి!

రాజు.—[నేల్యాఁసట నభినయించుచు లేవకయే] పొడు పొడు పొడువు.

[సేవకుఁడు పాపయ్యతోఁ గలియఁబడును. పాపయ్య వానిమెడ నొకచేతంబట్టి బయటికిం దెచ్చి సీతన్నచేత దానిం బెట్టును. సీతన్న వానినట్లేకొని నిష్క్రమించును. పాపయ్య మరల లోనికి పరిక్రమించును.

రాజు.—[ఈయలబలమునకుం బోల తేచి మంచము దిగి యివలికి వచ్చి కవాచిపై కూర్చుండి] ఏదిరా పులి? ఎటుపోయినదిరా? చల్లారామా, ఏమైతివిరా! హా పులి వానిని జేసికొని పోయినదా?

[అని అన్నివైపుల వెదకుట నభినయించును.

పాపయ్య.—[ప్రవేశ మభినయించి ఎడమచేతితో రాజును గొంతునం బట్టుకొని కుడిచేత బాకు కొని అతని గుండియకుం గదియించి] తప్పించుకొన యత్నించితివా, తత్క్షణము గటుక్కనిపించెద. రాజా, ఇది అడవి పులిగాదోయి, బొబ్బిలిపులి; దీనిపేరు బొబ్బిలి బెబ్బులి తాండ్ర పాపయ్య. ఈపులియే చల్లారాముని కొనిపోయినది.

రాజు.—పాపయ్యా, దొంగపోటు పొడువ వచ్చితివా!

పాపయ్య.—నీవు దొంగప్రొద్దునఁ గదా ముట్టడి వేయించితివి ?

[నేపథ్యమున.]

'హా! నారాయణ! నారాయణ!'

రాజు.—హా! హా! చల్లారాముని గొంతు! [స్వగతము] బయట ఇతనిసిబ్బంది వచ్చియున్నారు గావలయు. (ప్రకాశము) పాపయ్యా, నిన్నుఁజూచి నతర్వాత, ఎంతపరివార మున్నను. ఇంక నేమి ఆశలు? ఈ బొబ్బిలి నీకిచ్చెదను, నాప్రాణములు కొనకు పాపయ్యా.

పాపయ్య.—అహాహా!

సీ. బొబ్బిలి యిత్తువా? యబ్బబ్బ శిబి కర్ణ
ధారాధరులకన్న దాత వైతి!
నీపాడుప్రాణంబు నేను గైకోనురా,
గాలిలోపల నది కలయుఁ జుమ్ము.
ఉండెబో మ్మామాట ; యూడెనా యోరి నీ
ప్రక్కలోపల నున్న బల్లెకోల?
వెలికి వచ్చెనో కంటివెనలుసు నీ కిప్పుడు?
పరులసొ త్తాశించు ఫలము గంటె?
తే. వీఱిఁడికి నీకు జగదేకవీరుఁ డైన
రావుపైఁ బగ యున నేమి రా బజీత?
వెంగళుని పెండిలికి నన్ను వెడలకుండఁ
జేసిన ఫలంబుఁ గుడుపు చేసేత నిపుడు. ౭౮

[నేపథ్యమున ఫిరంగియాగాదులు]

పాపయ్య.—ఒకమాట కయిన బదులు చెప్పవమ్మా. నాచేతి పట్టుచేత నోటమాట రా కున్నదా యేమి? పట్టు కొంచెము సడలించెదను.

[అని అట్లు చేయును.

రాజు.—[ఊపిరి త్రిప్పుకొని నిట్టూర్పు నిగిడించి]

శా. పాపారాయఁడ, రాచపుట్టువను, నీపాదంబులం బట్టితిన్;
నా ప్రాణంబులఁ గావు, నిండుకరుణ న్నాపాలిదైవంబ వై.

పాపయ్య.—

పాపా, పూనితికాదె బాలుఁ గరిచేఁ బాదాన మట్టింపఁగా!
నీ పాపంబులు నాకుఁ దెల్పినది వానిం దాది కొంపోవుచున్.

నీవు నాశము చేయించిన మాకోటను గూడ చూచి వచ్చితిని జూహూ, రాజా, మారంగారాయని బంగారపు మంచముమీఁద పరుండెద నని ప్రతిజ్ఞ చేసితివఁట; నేను వచ్చుతఱికి దానిమీఁదనే గదా ఉంటివి, నిన్ను దానిమీఁదనే సుఖముగా పరుండఁబెట్టి పెద్దనిదురఁ బుచ్చెద. ఇదిగో నిన్నుఁ గొనిపోయెద, పులినాకిన యొద్దా?

[అంతట బుస్సీయు హైదరుజంగును ప్రవేశింతురు.]

[పాపయ్య రాజును పిల్లికూనం బోలె ఎడమచేత మెడ పట్టుకొని యున్నవాఁడు, అట్లే కదిలించుచు, నిష్క్రమించును.

బుస్సీ.—ఏమి యిది! గడ్డి మేటిపాటి మూటను తాటిచెట్టుపాటి జమాను, ఎడమ చేతితో లోనికి కొనిపోవుచున్నాఁడు! ఈ రాజు తన సామా నంతయూ తరలించుకొనుచున్నాఁడు గావలయు. ఆహా! ఎంత మోసగాఁ డీతఁడు? పేష్కస్సులు ఎగవేయుటకై మనలనే సంహరింప మనమీఁదికే ఫిరంగులు త్రిప్పినాఁడు!

హైదరు.—[స్వగ.] నాకీ వష్కాన్న లక్షవర్హాలు యొ గెయ్య డానికిసహా.

[అంతట ప్రేవులహారాలతో రుధిరస్థాసకముతో, అట్టహాసముతో, తాండ్ర పాపయ్య ప్రవేశించును.

పాపయ్య.—[ఇటునటు వికటముగా పరిక్రమించుచు, పరవళ్లు ద్రొక్కుచు;] పూర్వము తాండ్ర పాపారాయఁడను, ఇపుడు రాకాసి మన్నీఁడ నయితిని. అయినను నాజూకుగా:—

సీ. రాజనంబులరాశి భోజనార్థంబుగాఁ
దంచుకై వడి వీని దంచినాఁడ,
పనసకాయను దోరపదనఁ గూరగ వండఁ
జెక్కుకై వడి వీని జెక్కినాఁడ,

పొట్లకాయను దియ్యఁబులుసు దప్పళమునకై
తఱుగుకైవడి వీనిఁ దఱిగినాఁడ,
అంటుమామిడిపండు నారగింపునకుఁగాఁ
గోయుకైవడి వీనిఁ గోసినాఁడ,

తే. యాతనల ప్రగ్గు మని వీని యమునియిల్లు
సేర్చితిని ; వీని కిఁక నేమి సేయఁ గలదు?
ఇంతచేఁతయు నాచేతి కించుకేని
యాఁటదాయె నిఁకేమి నా కాట గలదు? ౮౦

[అని ఆలోచించుట నభినయించుచుండును.

బుస్సీ.—హైదర్సాహేబ్, మన మొకటి అనుకొని వచ్చిన, ఇది మఱి యొకటి అయినది. ఇతనిమాటవలననే ఇతఁడు తాండ్రపాపయ్య యని తెలిసినది. ఇతఁడు రాజు వర్ణించినంతకన్న హెచ్చువాఁడుగానె యున్నాఁడు. రాజు చచ్చినాఁడు.

ఉ. స్తంభమునుండి పై కుఱికి దానవుఁ జీలిచి రొప్పుచున్న యా
దంభ మృగాధినాథుని విధంబునఁ బేర్చెడి దుర్నిరీక్ష్యుఁడై,
శుంభని నేర్చు రుద్రుని విఘూర్ణన తాండవ చండ సంభ్రమా
రంభము నూని చూడ్కికి భరంబగునీతఁడు మర్త్యమాత్రుఁడే!

ఇప్పు డీమహావీరుని ఎంతటివాఁ డైనను ఎంద అయినను సమీపించు టెట్లు?

హైదరు.—మాట్లాడకండీ ; ఇనబడితే మనమీదికే వస్తాడు.

పాపయ్య.—నాచేత వీని విజయనగరము కోట నా బొబ్బిలికోట లాగున నేల మట్ట మై, వీని జను లెల్ల మ్రంది, సంజీవిచేత రామసైన్యముం బోలె ఎట్లో మాజనులుమాత్రము అందఱును బ్రదికి, రంగారావు యథా

పూర్వము బొబ్బిలిలోను, చినవేంకటరాయని యువరాజుగా విజయనగరములో క్రొత్తకోట కట్టించుకొని అందులోను, ఈ జమీనుల నేలుచున్న, నాపగ తీఱును. [వెడవెడ అట్టహాసము చేసి] సరిసరి! ఏల యీ కాని తలంపులు? మఱి కడుపులోని యీ యాందోళనము తీఱు టెట్లు? ఆ! జ్ఞప్తి యైనది! ఆ హైదరుగాని చిత్రవధచేత తీఱును. ఈ నడిమిదేరా వాని దండు. దానిమీఁద నే పోయిపడుదునా? [పరికించుట నభినయించి] ఏమి? పరంగిదండు తురకదండును నాపైపే వచ్చుచున్నవి? ఇవి బుస్సీ హైదర్ల దండులు గావలయు. ఈ రాణువలు నన్ను గుఱిపెట్ట నేమి? ఆ! తెలిసినది. నావెనుకనుండు తమ స్నేహితునకు రాజునకు వాని దండునకు తగులు నని కావలయు. మఱి యిది నన్ను పట్టుకొన యత్నమా? సామ లగువులు లేవా? ఆహాహా! దండ్లా నాపైకి!

దండు దండు లటంచు గుండె తల్లడ మేల?
కొండంత వామికిఁ గొఱకచ్చు చాలు.
కట్టెమో పులరాశి గగనంబు ముట్టనీ,
చిట్టి నిప్పుక కాల్చి సివమాడుఁ బైని.
ముక్కంటి నిటలాన మొలకెత్తు మంటకు
నెక్కువా యేమి యేడేడు లోకాలు? రౌ౨

[దండు ప్రవేశించును. పాపయ్యవైపు నడుచును.

పాపయ్య.— ఆహా! ఇన్నాళ్లకు నాచేతికి అటిన యీడవిసఱకాఁడు దొరకినది. రండోయి మొనగాండ్రారా, రండి. [ప్రేవులహారములం జూపుచు] తాండ్ర పాపయ్యనయ్యా! మా స్నేహితుఁడు విజయరాముఁడు ఈ మా హారములను దొంగిలించి తమాషాకు తన కడుపులో దాఁచుకొన్నాఁడు; వీనిని నేను గైకొని తమాషాకే ఆతనిని రాజదండనం బొందు మని యమధర్మరాజుకడకు పంపితిని. రండు మీరును పోయి ఆతమాషా చూతురుగాని.

సిపాయీలందఱు. [ఒకరితోనొకరు] తాండ్ర పాపయ్య! పాపయ్య రాజునుసంపాచ్చి ఆవేశ మాడుతున్నాడు. మనము రాజుమీదికి వస్తే ఇక్కడ మఱి కోలాహలైంది.

[పాపయ్య వారింగూర్చి 'కిల్లల్లల్లా' అని యార్చి, బాహాస్ఫోటనము సేయును. వారు వెఱచఱచుట నభినయించి వెనుకకు విఱుగుదురు.

పాపయ్య.—అయినదా మీపని? సముద్రమును చూడఁగానే మీగుండె బ్రద్దలైనది. అడ్డు ఈఁదఁదెగఁబడువాఁ డెవఁడు? దావాగ్నిం జూడఁగానే శల్లు పాఱిపోయినవి, దానిని దాఁటిపోవున దేది! పొండి! పిడికెఁడుకూటికై దేహ మమ్ముకొన్న కక్కూరితిగాండ్రు మీరు. మీ పెండ్లాముబిడ్డల యొసురు నాకేల? మిమ్ము విడిచిపెట్టితిని. ఏమి! వెళ్లరా? ఏ మేని దురాలోచన గలదా మీకు? అటయిన నిలువుఁడు, మిమ్ము రూపుమాపెదను. [అని నఱకఁబోవును. దండు పలాయిత మగును.

పాపయ్య.—మఱి యెట్లయ్యా నా దప్పి తీఱుట? ఆహైదరుగానిం జీల్చి వానిరక్తమును కనులం జూచినఁగాని తీరదే! వానిం గనుట యెట్లు

[అని యరయుచుండును.

ఒక సిపాయి.—[ప్రవేశించి, పాపయ్యం గనకయే వడిగా బుస్సీహైదరులకడకుఁ బోయి]—సలాం బూసీధొరవారికి.

[పాపయ్య వినుట నభియించును.

సిపాయి.—సలాం హైదర్జంగు బహద్దరువారికి. ఆఫిరంగుల్ రాజామస్నీదికి కాల్చు చేశినవి గావు. తాండ్రపాపారా వంట, దొర అంట; ఆయనకే కింద దళవాయంట మిరాల సీతన్నంట. ఆయన మీకీ రప్పించడానికి వాటికి కాల్చినా డంట. పగదీర్చ చెయ్యడానికి వెళ్లిన రాజాదండూకి నాలుగు వందలమందికి సంపి 'శఖరికాత సావటానికి ఖారణం ఏమి?' అని పాడుచుకొని వచ్చినాడు ఇప్పుడే.—

పాపయ్య.—[స్వగతము] బళి ! సీతన్న నాకన్న ముందే పోయి నాఁడు.అహా ! హైదరు ఇక్కడనే దొరకినాఁడు ! బుస్సీ యున్నాఁడు బళి బళీ ! [ప్రకాశము] ఓహో ! బుస్సీదొరగారు ! ఇక్కడికే వచ్చి నారా ! వీరేగదా హైదర్జంగు గారు దూదేకులసీరులు.

బుస్సీ.—సలాంపాపారాయనివారికి.[హైదరు బుస్సీవెనుక కేఁగును.

పాపయ్య.—[తటాలున సింహము దుమికినట్లు హైదరుమీఁది కరిగి మెడను ఎడమచేతం బట్టుకొని ఇవలికి ఈడ్చుకొని వచ్చి] రారా దూదేకుల వాఁడా ? నిన్ను ఏకెదను. నీవేగదా నాభర్తు మాన్ప మన్నవాఁడవు, కోట వదలి పొమ్మన్నవాఁడవు. నీపద్దు సాధించితివి ! ఓరీ,

శా. నీవేబొబ్బిలికోట వొదువు సుమీ ; నీప్రాణమే రాయఁడౌ ;
నీ పి ప్పుక్కిరి బిక్కిరిం బడుడు గుండె ల్గొట్టుకో న్నబ్బమే
తా వాద్యోత్తమ మైన నౌబతగు;హైదర్జంగ,యీబాకునన్
నీవాద్యంబును జీల్చెదన్; వెలి కిదే నీరాయనిం దోలెదన్.

[బాకెత్తి] తలఁచుకో నీసామిని !

హైదరు.—నీవే నా సామి ! శరణు శరణు మహారాజ్ ; రచ్చించు రచ్చించు; సామీ రచ్చించు.

పాపయ్య.—[ఆశ్చర్యముతో] ఓరీ నీచుఁడా ! ఈ టక్కు ఎక్కడ నేర్చితివిరా ! మా రంగారాయని బారిం బడిన యీ విజయరాముని భటుల కడ నేర్చితివా?

బుస్సీ.—రాయనింగారూ, శర ణన్న తర్వాత కొట్టుట మీ వెలమ నీతులలో లేదే. కావుఁడు దీనుని.

పాపయ్య.—బుస్సీదొరా, నీవు మిక్కిలి దొడ్డవాఁడవు, మా చిన వేంకటరాయనిం గాచినవాఁడవు; వీనిచే మోసపోయితివి. నీవు తురుపు ఇచ్చిపంపఁగా వేంకటలక్ష్మి సామర్లకోటకుఁ బోవుచు మాలపల్లి కడనుండి మాకు సకలవృత్తాంతములను బారికవాని ముఖమునం జెప్పి బంపిన

సలాము నీకు. నీమాటచే వీనిని నాగూరి మీరాసాహెబు ఠెక్కాముగాకు బలాదూరుగా విడిచి పెట్టితిని. [అని మెడ విడిచి పాఱిపైచును.

హైదరు.—[స్వగతము] బతికినాను రా బాబూ!

[అని మెడ తడవుకొనుచు, నిట్టూర్పులు నిగుడ్చుచు, పడియే యుండును.

పాపయ్య.—బుస్సీదొరా, చూచితివా మాబొబ్బిలి వెలమలబీరమును?

బుస్సీ.—చూచితిని, అనుభవించితిని, మెచ్చితిని.

పాపయ్య.—విజయరాముఁడు పంద యని కనుఁగొంటివా?

బుస్సీ.—నూఱు మార్లు.

పాపయ్య.—ఇఁక నా కిక్కడ పని లేదు. నేను త్వరగాపోయి రంగారావును నా కేల కబురు పంపలేదో అడుగవలయును.

బుస్సీ.—ఆయన పంపినాఁడు. జాబులం దెచ్చు హర్కారులను రాజుపట్టించి నాఁడు. వారు పోరి చచ్చినంతట ఆజాబులం గైకొన్నాఁడు.

పాపయ్య.—కబు రందియు నేను రాలే దని రంగారాయఁడు నామీఁద కోపగించుచుండును. నేనుపోయి యీసమాధానమును చెప్పకోవలయును.

బుస్సీ.—బాలుని తక్తు ఎక్కించి నీవు మంత్రివిగా జమీ నేలించుచుండవలయు నని నాప్రార్థన.

పాపయ్య.—ఆపని నీలాద్రిరాయఁడు కావించును. నేను నాకు ప్రేత పిండము వైచుకొంటిని; ఇఁక నీలోకమున నుండఁజనదు. నేను పోయి విజయరామునికడనే పరమపదించెద. మీదం డ్లన్నియు వచ్చి చూచు నపుడు, రాజుం జీల్చిన పులి యిది యని తెలియవలదా?

[అని తటాలున నిష్క్రమించును.

బుస్సీ.—హైదర్సాబ్, రాజవధచిత్రమును చూచి వత్తము రా.

హైదరు.—మీరుపోయి నూడండి, కడుపునిండా నూస్కొని రండి, నేను రాను. అక్క పాపయ్య ఇంకా పొడుచుకొన్నాడో బతికే

వున్నాడోళ్లి ఈతూరి అయిన నా మీదాక్యాయకి సులిమితే, నేను బత్కడం అబ్దం.

బుస్సీ.—అటయిన నేను మాత్రమే పోయి చూచివచ్చెదను.

[అని నిష్క్రమించును.

హైదరు.—అబ్బా; మెడ పడిపోయిందిరా, నాయొద్ద్యభాగం అంతా చితికి పోయింది. [అని మెల్లఁగా కష్టముతో లేచి] ఇప్పట్కి నాకీ పానం దక్కింది, లక్షువర్హాలు మునిగి పాయినయి.

[అని నొప్పి నభినయించుచు, కుంటుచు నుండును.

బుస్సీ.—[ప్రవేశించి] హాహాహా ! ఏమి ఘోర వధ !

శా. వేలుక్ లక్షలు మాంసరాసులు నభోవిస్తార మావిస్తరిక్
గ్రాలక్, భుక్తికిఁ గూరుచుండి, మునుశర్వధ్యానమందున్న బే
తాలుండోయన, రాజమాంసఖల సక్త ప్రేక్ష బద్ధాసనా
భీలుం, డాత్మహతుండు పాపయయుఙ్ వీక్షింపఁగా వ్రేఁకమై.

[నేపథ్యమున కలకలధ్వని - ఓంభాయి, ఓంభాయి, ఓంభాయి]

బుస్సీ.—ఇది, ఓహో. ఆనందరాజు పట్టాభిషేకముకై వచ్చుచున్న కలకలము గావలయును. హైదర్, మనము పోయి ఈతనివలన మనకు రావలసిన ఫేష్కస్సుల నిక్కడనే పుచ్చుకొందము. ఈతఁడు మరల విజయనగరముకోట చేరెనా, మనకు పైకము ముట్టదు.

హైదరు.—అలాగే చేద్దాం. [స్వగతము] ఈగంధర్గోళంలో నా లక్ష మునిగిపోయింది. [అని అందఱు నిష్క్రమింతురు.

# దశమాంకము.

స్థలము:—గోలకొండ నైజాము దర్బారు.

[నైజాము, నజీరు, బుస్సీవారు, హసేనాలీ, పరివారంబును యథోచితము ప్రవేశింతురు.]

నైజాము.—నిన్న హైదరును శిక్షించిన యాగ్రహములో అడుగ నైతిని. హసేనాలీ, ఇందఱు సర్దారులు గతించిన యీ రణములో నీ వెట్లు బ్రదికి వచ్చితివి?

హసే.—మహాప్రభూ, నేను రాయనివారి పక్షముగా వాదించినం దున నన్ను యుద్ధము చేయనీక హైదర్జంగు నిలిపినాఁడు.

ప్రతీహారి.—[ప్రవేశించి] బందగానే ఆలీ; నిన్ననే తెలుపుడు చేసుకొన్నవారు బొబ్బిలిరాజాగారి కుమారుణ్ని తోడ్కొని నీలాద్రిరావు గార్లు దాది వచ్చి వున్నారు.

నైజాము.—ఓహో! సమయానకు వచ్చినారు. తత్క్షణ మేతోడ్కొనిరాకి

ప్రతీ.—[నిష్క్రమించి తోడ్కొని వచ్చి] వారే గోలకొండపాదుషా గారు. ఖూర్నిషు సలాములు చేయండి. [అని నిష్క్రమించును.

[ముగ్గురు మోఁకాలిమీద నిలుతురు.

నీలాద్రి.—బందగానే ఆలీ, మీగులామును, సామర్లకోట నీలాద్రి రాయఁడను సలాము చేయుచున్నాను. [అని సలాము చేసి, చేతులు జోడించు కొని బాలుంగూర్చి] బాబూ నీవు చెప్పు.—"నేను పాదుషాగారి గులా మును, బొబ్బిలి రంగారాయనింగారి కుమారుఁడను, చినవేంకటరాయఁడను, సలాం చేయుచున్నాను" అని.

బాలుఁడు.—నేను పాదుసాగారి గులామను, బొబ్బిలి రంగారాయని వారి కుమాలుదను, చినవేంకిటలాయదను, తలాము చేస్తున్నాను.

నీలాద్రి.—బాబూ; ఇట్లు సలాము చేయుము. [అని నేర్పును.

[బాలుఁడు సలాము చేసి చేతులు జోడించుకొని యుండును.

దాది—నేను రంగారాయనివారి జనానా దాసిని, ఈ చిన్నబాబుగారి చిన్నదాదిని, వేంకటలక్ష్మిని. [అని సలాము చేసి చేతులుజోడించుకొని యుండును

సైజాము.—నీలాద్రిరావుగారూ, మాకు బుస్సీగారివలన బొబ్బిలి వృత్తాంతమెల్ల తెలిసియున్నది. మీరు వచ్చినపని సంగ్రహముగా చెప్పకొండి.

నీలాద్రి.—అటయిన మాపిర్యాదు కరము సంక్షిప్తమైనది. ధర్మరక్షకా; హైదరుజంగు చేసిన ద్రోహమువలన బొబ్బిలిగడ్డలో మిగిలిన మగపురుగు ఈశిశువు ఒక్కఁడే! స్త్రీలలో వీనిం బాయని యీదాదియొక్కతె మిగిలినది. వీని నోటిముందఱ, సర్కారు పెట్టిన సున్నమును, బొబ్బిలి జమీనును, విజయనగరము దొర ఆనందరాజు అపహరించినాఁడు. ఈబాలుఁడు, హుజూరునకు, వంశక్రమాగతుఁడు, గులాము; వీనికి అన్నము పెట్టుము భూలోక దేవేంద్రా.

సైజాము.—బాలుని రక్షించెదము. ఆదుష్టుని హైదరును దండించినారము. లెండు కూర్చుండుఁడు.

[నీలాద్రిరావును బాలుఁడును లేచి కూర్చుందురు.

సైజాము.—[సభ్యుల నుద్దేశించి] నిన్న వానిపైఁ గలిగిన యాగ్రహములో మిమ్ము నడుగలేదు; ఇపుడు, చెప్పుఁడు: వానికి విధించిన దండన రాజధర్మసముచితమా గాదా?

వజీరు—బందగానె ఆలీ, అంతకన్న న్యాయ మయిన దండన యుండునా; బొబ్బిలి మహావీరులను హుజూరువారి రాణువను నాశముచేసినందులకు వానికి ఉరి దండన. వాఁడు లంచము గొని, సర్కారు పైకము పోఁగొట్టినందులకు ఇప్పటివఱకు వాఁడు లంచాలచేత చేర్చిన లక్షోపలక్షల ధనమెల్ల సర్కారు ఖజానాకు దాఖలు. మఱి విశేషము. వాని కుటుంబమునకు, యావజ్జీవము, జీవనాంశము. ఇంతకన్నను ధర్మముండునా?

నైజాము.—విజయరామరాజుమీఁదికి కత్తి దూసిన బాలుఁడు ఇతఁడేనా?

బుస్సీ.— ఔను సర్కార్;

నైజాము.—ఏమి బాలకా, అట్లు చేసితివా?

బాలుఁడు.—మాబాబును చంపించిన వాన్ని నేను కొత్తాన్దా?

నైజాము, వజీరులు.—[హర్షముతో] అరరే! అరరే!

నైజాము.—మఱికొట్టితివా?

బాలుఁడు.—ఈ బూచిదాగ అడ్డపడ్డాడు అందుకోసం కొత్తలేదు.

నైజాము.—ఆయన పెద్దవాఁడే నిన్ను పొడిచిచంపిన నీవేమిచేయుదువు?

బాలుఁడు.—చావంతే భయమా? చావుకి భయపడ కూడదనిమావాల్లందఱు చెప్తారు. చంపేస్తే మాబాయ్యకాడికే వెల్తాను. అది నాకు యిష్టమే గదా!

అందఱు.—అరరే! అరరే! బాపురే బాలకా!

బుస్సీ.— మహాప్రభూ; ఈదాదియే తన చేతినుండి యీబాలుని హరింపవచ్చిన వారిని మన సిపాయీలను నూఱుగురను పరిమార్చినది.

నైజాము, సభ్యులు.—బలారే! బలారే! ఏమి వీరభూమి ఆగడ్డ!

నైజాము.—లే దాదీ, లే, నిన్ను మెచ్చినారము.

వేంకట.— ధర్మరక్షకుని కటాక్షము. [అని లేచి నిలుచును.

నైజాము.—దివాన్ బహద్దర్ టోగ్రాలీ గారూ—కుమారునికి సర్వము యథోచితము జరుపునట్లుగా ఇపుడు ఉత్తర సర్కారులకు దొరలైన యింగ్లీషువారి గవర్నరుగా మదరాసురాజధానిలో నేలుచుండు దొరగారికి మాసిఫారసును జాబువ్రాయుఁడు. ఆ జాబును ప్రత్యేకముగా రవానా చేయుఁడు. దానినకలును వీరికిపుడు మేమిచ్చిన ఫర్మానాగా మాసికాము హరులనుం బొందించి, సవారిలో ఉంచి దానిని, ఇంక ఈచిన రాజావారికి షేమిచ్చినవిగా అనర్ఘ్యములైన మహారాజోచిత దివ్యభూషణములను ఒక

కత్తులాని తేజీని, ఢంకౌను, మేళతాళములతోఁ గూడ వారి సవారివెంటం గొనిపోయి వారిబసలో చేర్పుఁడు. నీలాద్రిరాయనింగారికి మాగొప్పసర్దారులకుందగిన మరియాదలతో సత్కారింపుఁడు. బాలుని గాచుటచేత మాకు గొప్పమెహనత్తు గావించిన ప్రభుభక్త శేఖరమణి వెంకటలక్ష్మిచేతికి నవరత్నఖచితమయిన జాలుహాపసిఁడితోడా తొడుగుఁడు.

టోగ్రాలీ.—[లేచి] సర్కారాజ్ఞ. [అని కూర్చుండును.

నైజా.—హసేనాలీ, నీవు వీరితోఁ గూడఁ బోయి, మాఫర్మాన బొబ్బిలిలోను, విజయనగరములోను, ప్రకటించి, ఈ రాజావారిని బొబ్బిలి జమీనులో కుదురు పఱిచి, రమ్ము.

హసేనాలీ.—(లేచి) సర్కార్ ఆజ్ఞ. [అని కూర్చుండును.

నీలాద్రి, దాది.—మహాప్రసాదము, మహాప్రసాదము.

నీలాద్రి.—బాబూ, 'మహాప్రసాదము' అని చెప్పుము.

బాలు.—మహాప్లసాదము.

[నౌకర్లు పళ్లెములో రత్నాల కటారి పన్నీటి కూజాయును తెచ్చి నైజాముకడ నిలుతురు.

నైజాము.—కుమారా, చినవేంకటరాయా, ఇటు రమ్ము.

[బాలుఁడు పోయి సాఁకరించి నిలుచును.

నైజాము.—ఇది మేము మాచేతితో నీ కిచ్చిన యినాము. (అని కటారిఇచ్చి, పన్నీరు చల్లి పోయి కూర్చుండును.

బాలుఁడు.—మహాప్లసాదము.

[అని సలాము చేసి పోయి కూర్చుండును.

[నైజాముకనుసన్న చేత దివాను నీలాద్రిరాయనికి పన్నీరు చల్లును.

నీలాద్రి.—మహాప్రసాదము, మహాప్రసాదము!

నైజాము.—ఆదాఁయియు వీరులలో గణన కెక్కినది. ఈబాలుని కని తల్లికన్న ఎక్కువ. బాలునిం గాపాడినందున మాకు చాల మెహనత్తు చేసినది.

[అని హసేనాలీకి కనుసన్న చేయును.
హసేనాలి దాదికి పన్నీరు చల్లును.

దాది.— మహాప్రసాదము, మహాప్రసాదము !

సైజాము.— నీలాద్రిరావుగారూ, మీకోరిక తీఱినదా ? ఇంక నే మయినం జేయవలయునా ?

నీలాద్రి.—

ఉ. వేంకటరాయనిన్ సిసువు వే కయికొంటిరి తల్లిదండ్రులై ;
యంకిలి యైన ద్రోహి తెగటాఱెను ; వీరులు పద్మనాయకుల్
బొంకరు కొంక రార్తులను బ్రోతు రటం చెద మెచ్చు కొంటిరే,
యింకను నేమి గోరుదు నహీనశయాన సమాన తెల్పుఁడా.

ఆయిన నిది యగుఁ గాక !

(భరతవాక్యము.)

శా. సర్వజ్ఞాంకిత సింహరాట్ప్రభవ వంశ ప్రాజ్య ముక్తామణుల్
గర్వోన్నద్ధ సపత్నభూమిధర పక్షచ్ఛేద నాఖండలుల్
ఉర్విం బ్రోతురు గాత శేషఫణిబాహుల్ని చ్చలుం బోషితాం
తర్వాణీంద్రులు పద్మనాయకులు సద్ధానాయకప్రాభవుల్. ౧౬
[అందఱు నిష్క్రమింతురు.

బొబ్బిలియుద్ధనాటకము సమాప్తము.